Regd No. N. 45 / M. 3813

౧౦౨౬౭౭

వెల ఒక అణా

మా ప్రచురములు

గోలకొండ కథాసంచిక ౧౪ అ.
గయోపాఖ్యానము (ప్రాచీనప్రతి) ౪ అ.
ఉచ్ఛలవిషాద నాటకము ౮ ,,
నిజాంరాష్ట్ర పరిపాలనం ౪ ,,
ధరలన్నీ తగ్గింపబడినవి,
గోలకొండ పత్రికాలయం

# గోలకొండపత్రిక

ప్రతి సోమ గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

హిందువుల పండుగలు
కర్త
సు. ప్రతాపరెడ్డి
౩౦౦ పుటలు గ్లేజు కాగితము
వెల ౧ రూ॥ మాత్రమే.
మేనేజరు గోలకొండపత్రిక

సంపుటము ౧౬ ★ హైద్రాబాదు,దక్కన్. శా. శ. ౧౮౬౩ వృషనం॥ర కార్తీక బ॥ ౧౩ (౧౩-౧౧-౧౩౫౧ ఫ.) సోమవారము సంచిక ౫౪

# క్రీమియాలో జర్మనువిజయములు

## మాస్కో-రంగమున రష్యనుల ప్రతిఘటనవిజయము

### లెనిన్గ్రాడు చుట్టుముట్టడి వేయబడుచుండుట

నవంబరు ౧౦ వతేదినుండి ౧౩ వతేదివరకు వచ్చినవార్తలవల్ల క్రిమియాలో జర్మనుసేనలు మరికొన్ని స్థానములనుపట్టుకొన్నట్లును, మాస్కో-రంగమందు కొన్ని చోట్లజర్మనులు క్రొత్తపోటును జేసిమరల విఫలులైనట్లును, లెనిన్గ్రాడురంగమందు జర్మనులకొకవిజయము గల్గినట్లును తెలియుచున్నది. యుక్రెయినులో డోనెట్జుప్రాంతమందు యుద్ధము ఇరుపక్షములసేనలకును తీక్ష్ణముగాజరుగుచునది ఖార్కోవుప్రదేశములో జర్మనుసేనలు వెనుకకు తరిమివేయబడినవని రష్యనులనుచున్నారు.

క్రిమియాలో సెబాస్టపోలువద్ద జర్మనులను వెనుకకుతరిమివేయుటకు రష్యనులు నవంబరు ౯ వతేదినయత్నించిరి. కానియుదకు రష్యనులే వెనుకకుపారిపోవలసివచ్చెను, అందుపై జర్మనులు కొన్నిదుర్గములను పట్టుకొనిరి. నవంబరు ౧౧ వతేదివాటికి జర్మనుసేనలు సెబాస్టపోలును, సిమ్ఫరపోలుకుమధ్య సెబాస్టపోలునుండి ౨౦ మైళ్ళదూరమందుండు బాక్చి సెరాయిఅనుస్థానమును, కెర్చినుండి ౨౦మైళ్ళదూరములో క్రిమియాయొక్క తూర్పుకొసనుండు మారిరో స్టాల్ అనుస్థానమునుపట్టుకొన్నరట. ౧౨ వతేదినాటికిఆసేనలు కెర్చికి దక్షిణమున క్రిమియాసముద్రతీరమును జేరినవి- నవంబరు౧౩వ తేదినాడు ఒకరష్యాపత్రికలో ఇంతవరకు జర్మనుసేనలదూకుడ్ని వెనుకకు నెట్టివేయబడినట్లు తెల్పబడినది. కానికెర్చిపట్టణమునకుదక్షిణమున సముద్రతీరమందున్న అనేకదుర్గములనుపట్టుకొంటిమని జర్మనులును, కెర్చిపట్టణమునే జర్మనులుపట్టుకొనిరని రోంరేడియోయున్ను ప్రకటించినట్లు మరొకవార్తవచ్చినది- సెబాస్టపోల నుండి ౪౦ మైళ్ళదూరమున యాల్టా అను ఆరోగ్యాశ్రమస్థలము జర్మనులకుచిక్కినట్లు గతసంచికలో మాచియున్నాముగదా, అస్థలమున జర్మనుసేనలు ప్రవేశించిచూడగా అదియంతయు ధ్వంసితభవనములచే నిండియుండెను. రష్యనులు దానినిపాడుచేసి వెళ్ళిపోయియుండిరి.

ఇకమాస్కో-రంగముసంగతి ఈరంగమందు జర్మనులు దక్షిణమున నారానదిగాని ఓకానదినిగాని ఇంకనుదాటలేక పోయున్నారు- పోలోట్స్లాంస్కు-వద్ద ఒకస్థావరమును రష్యనులుముట్టడిచేసినారట- తూలావద్దకు జర్మనులు ౧౧ వతేదిన క్రొత్త సేనలనుచేర్చి క్రొత్తపోటునుయత్నించిరి- అప్పుడుదెబ్బకు రష్యాసేనలు కొంచెమువెనుకకు తగ్గి తూలాయొక్క-దక్షిణమునుండి ఎదురుపోటు వేయగా జర్మనులు అయిదుమైళ్ళు వెనుకకుపోవలసివచ్చెను-కానిజర్మనులు ఇంతటితోవదులుకొనక ఏవిధమునైనను అపట్టణమునుపట్టుకొనవలెనని పట్టుబట్టియున్నారు- మాస్కోకుఉత్తరమున జర్మనులుపట్టుకొన్న అనేకములైన జననివాసములలో రెండింటినిరష్యావారలు తిరిగిఆక్రమించగలిగినారు-కాని జర్మనులు తమపట్టువదలుకొనక క్రొత్తగాసేనలనుచేర్చుచున్నారు- మొత్తముమీదజర్మనులింకను మాస్కోకు ౬౦ మైళ్ళదూరమునన్నారు- అక్కడినుండి మాస్కో-నగరములోచేరవలెనని నీబాటలన్నిటిఅడుగున ప్రేలుడుమందులుదాచబడియున్నవి- మరియు ఆబాటలలో జర్మనులు సుళువుగాప్రవేశించి రాలేకుండ రష్యనులుచాటుననుండి ఒకయంత్రిబిగిప్పగానే ఆబాటలలోవచ్చేవారిని మంటలలో అసరింమనట్లు చేయుఏర్పాటులు అమర్చబడియున్నవి-

యుక్రెయినులో డోనెట్జురంగమందు చెప్పదగిన గొప్పవిశేషాలులేవు-

లెనిన్గ్రాడువద్ద తూర్పున ౧౨౦మైళ్ళదూరమందుండు తిఖ్విన్ అనుపట్టణమును నవంబరు ౯ వతేదిరాత్రిపట్టుకొన్నామని జర్మనులుప్రకటించినారు- లడోగాసరస్సుయొక్క-గట్టు ౧౫ మైళ్ళదూరమును జర్మనులాక్రమించియున్నారు- ౧౦ వతేదిన రష్యనులుసేననదిని దాటిపోవుటకు యత్నించగా జర్మనులువారలను పోనీయులేదు- జర్మనులిపుడు ఆనగరముచుట్టును గట్టిగాముట్టడి చేసి రష్యనులసేనసుకూడ నీళ్లులేకుండనాశనముగునట్లుచేయజూచుచున్నారు- కాని ౧౧ వతేదిన రష్యనుసేనలు ఒకచోటనుండి జర్మనులను వెనుకకుపారదోలగలిగినట్లు రష్యావారి ఒకరేడియోలో ౧౨ వతేదినచెప్పబడినది-

ఇంకను ఉత్తరమున తెల్లసముద్రములో ఓనెగాసింధుశాఖయందుండు సారోకా వైపుభన్నుల సేనలువశపరిపోవుచున్నవి- నవంబరు ౧౦ వతేదినాటికవి ఆముఖ్యమైనరైల్వేజంక్షనుకు ౧౫౦ మైళ్లదూరమునయుండినవి-

జర్మనులిపుడు ప్రతిరోజు మాస్కో-మీదను, సెబాస్టపోలుమీదను కెర్చిమీదనువిమానాలనుండి బాంబులనుఅపరిమితముగా వేయుచున్నారు. లెనిన్గ్రాడ్ మీద విమానాలనుండి బాంబులను వర్షించుటయేగాక పెద్దఫిరంగులనుకూడ ప్రయోగించుచున్నారు-

నవంబరు౫వ తేదినుండి ౧౦వ తేదివరకు రష్యనులు బారెంట్సుసముద్రములో రెండుశత్రునౌకలను బాల్టిక్ సముద్రములో మూడుశత్రునౌకలను ముంచివేసిరి- జర్మనులవెనుకరష్యను గొరిల్లాలు చేరిబాధించుచున్నారట-

### అమెరికాకు ఫిన్లెండుజవాబు

అమెరికాప్రభుత్వమువారు పంపిన హెచ్చరికకు ఫిన్లెండుప్రభుత్వమువారు జవాబును నవంబరు౧౧వ తేదిరాత్రి తమదేశంలోని అమెరికాప్రభుత్వరాయబారికంద జేసినారు- అదియింకను అమెరికాప్రభుత్వమువారికి చేరినట్లు వార్తరాలేదు- ఆజవాబుపత్రమందు ఫిన్లెండుకేవలము ఆత్మరక్షణకొరకే యుద్ధముచేయుచున్నాము, ఫిన్లెండుయొక్క- అసలుసరిహద్దుకావలఏ ఏస్థానములనుండి శత్రువుతనమీదికి సులువుగాదండయాత్రచేయుటకై దూరవీలగునో ఆస్థానములను శత్రువుకు ఉపయుక్తములుగాకుండచేయుట తమకవసరమనియు, ఇందువల్ల అమెరికావారిఅవసరములకు వేటికిగాని భంగముకలుగుటలేదనియు, అట్టితమకుభయమునకు నిలయములైనశత్రుస్థానములను ధ్వంసముచేసి, తమదేశముస్థిరముగా శత్రుభయములేకుండునట్టి గట్టిఏర్పాటుచేయువంతవరకు ఆర్థముకేకుండ యుద్ధమునుమానివేయజాలమనియు, అమెరికావారి హెచ్చరికలో సూచించినట్లు జర్మనీబాడియెత్తునని తాముభయపడవలసిన అవసరములేదనియు, ఫిన్లెండుప్రభుత్వమువారు తెలిపినారు-

ఈవార్తనుగురించి అమెరికాప్రభుత్వపువిదేశాంగమంత్రిగారు నవంబరు౧౨వ తేదిన పత్రికలప్రతినిధులతో ముచ్చటించుచు, అమెరికాకోరినదంతయు రష్యాకుమూర్మాన్స్కు-, ఆర్కేంజెల్ మున్నగు రష్యాఉత్తరప్రాంతపుసముద్రపు రేవులమీదుగా అమెరికాబ్రిటనులు పంపించేయుద్ధసామగ్రులు రష్యావారికిచేరకుండ ఫిన్లెండువారు జర్మనులతోకలిసి ముట్టడివేయుచుందురా అనిమాత్రమేఅనియు అందుకుఫిన్లెండువారు నూటికినూటికి అనలేదని విమర్శగావించిరి. ఇపుడుఅమెరికా, బ్రిటనులు ఫిన్లెండురష్యాలవైరము మాన్పించుటకు ఇంకనుఅవకాశమున్నదనియే తలచుచున్నవి- అందువల్లమరలప్రయత్నము చేయనున్నరట-

### అమెరికాకు క్రొత్తరష్యారాయబారి

ఇంతవరకు అమెరికాకు రష్యాప్రభుత్వపురాయబారిగనుండిన ఔమన్స్కీ గారిపుడు రష్యాప్రభుత్వవిదేశాంగశాఖలో ఒకగొప్పఅధికారములో నియుక్తులగుదురట- అమెరికాకు రష్యారాయబారిగా లిట్వినాఫ్ గారు నియుక్తులైనారు

### జపానువ్యవహారములు

జపాను అమెరికాకుప్రత్యేకముగాపంపిందినదూత అమెరికాప్రధాననగరమగు వాషింగ్టను నగరమునకింకను చేరలేదు- ఈలోగాఆస్ట్రేలియా, న్యూజీలెండు, బ్రిటను, అమెరికాలుజపానువిషయములో అందోళనతోనుండు జాగ్రతలన్నియు అవలంబించుచునే యున్నవి- బ్రిటిషువారితోఅమెరికావారుకలిసి పనిచేయుటకొకవిధానము ఏర్పాటుచేసికొనబడినది-

చైనానుండి అమెరికావారుతమనౌకలనుతొలగించి వేయుచున్నారు- అమెరికానౌకాశాఖమంత్రియగు కర్నల్ నాక్సు గారు నవంబరు౧౧వ తేదిన రూడ్ దీవిలో ఉపన్యసించుచు అమెరికాఅమక్కు-లను జపానీయులు భంగపరచుచుండగా ఇంతకాలము ఓర్చుకొనియుంటిమిగాని ఇకఓర్చుకొనియుండ వీలులేదనిరి- ఆస్ట్రేలియావారుక్రొత్తగా ఎప్పుడుచేయుచున్నారు-

జపానుకుటోజోగారు క్రొత్తగాప్రధానమంత్రియైనతర్వాత ఇండోచైనాలోఉంచబడిన జపానీయసేన మూడింతలుచేయబడినదై ఇపుడు ౧౨౦౦౦౦ఉన్నది- పెద్దనదిమీదగూడా జపానీయసేనలు నవంబరు౧౨, ౧౩వతేదులలో హాంకాంగుకు రప్పించబడినవి-

౧౩వతేదినాడు పత్రికలప్రతినిధులతో ముచ్చటించుచు ఒకచైనాసైనికాధికారి జపానీయులుచైనావారి యూనానురాష్ట్రముమీదికివాడివెడలినచో ఇండోచైనాపైచైనావారు బాంబులవేయగలరని చెప్పినారు- జపానువారిపుడుబ్రిటిషుఅమెరికావారలప్రదేశాలన్నింటినుండి తమదేశీయులను స్వదేశానికిచేర్చుచున్నారు-

### థాయిలాండువారిభయము

థాయిలాండురేడియోలో నవంబరు౧౦వ తేదిన ఆదేశప్రజలకుచేయబడిన ఒకహెచ్చరికలో ఆదేశీయులుయుద్ధమునకు తయారుగానుండవలెనని చెప్పబడినది- ౧౨వతేదిన రేడియోలో చేసిన హెచ్చరికయందు థాయిలాండులో శత్రుశాఖలగూఢచారులున్నారు- జాగ్రత్తయనిచెప్పబడినది- థాయిలాండుకుఅమెరికానుండి విమానాలుకొండఃలై యుద్ధసామగ్రిని సంపాదించుటకై థాయిలాండువారు యత్నించుచున్నారు-

### స్పెయినుమంత్రి ఆలోచన

స్పెయినువిదేశాంగమంత్రి ౧౦వతేదినాడు జర్మనీ, ఇటలీ, జపానులరాయబారులతో ఏమోఆలోచనచేసినాడు-

### అమెరికాతటస్థ్యశాసనపు సవరణ

అమెరికావర్తకనౌకలపై ఆయుధములనుంచుటకును, ఆనౌకలు యుద్ధసామగ్రులనుతీసికొనియుద్ధముజరుగుచున్న ప్రాంతములలోనికి పోవుటకును అమెరికాతాటస్థ్యశాసనములో అటంకములుగానున్న భాగాలను తొలగించివేయవలెనని అమెరికాసెనేటువారు గావించిన నిర్ణయమునకు అమెరికాప్రజాప్రతినిధిసభలో ౨౧౨మంది సమ్మతించినారు, ౧౯౪మందివ్యతిరేకించినారు- ఈవిధమైననిర్ణయము నవంబరు౧౩వ తేదినజరిగినది ఇపుడుఈనిర్ణయముపై రూజ్వెల్టుగారు సంతకమునుపెట్టనే చేసినతర్వాత అదిశాసనమగును రాగలదు- ఈనిర్ణయమునుసరించి అట్లాంటిక్ సముద్రంమీదుగా బ్రిటనువరకుఅమెరికావారినౌకలు సు. విమానములుసహా తిరుగుచుండుటయు అమెరికానుండి సామగ్రిగొనిపోవుఓడలకు రక్షణనౌకలు వెంటపోవుచుండుటయు, బ్రిటిషుదీవులందుకూడ కీలకస్థానాలలో అమెరికావారియుద్ధనౌకలు, విమానాలుఉంచబడుటయు, జిబ్రాల్టర్ గుండా మధ్యధరాసముద్రమందలి బ్రిటిషు రేవులకు అమెరికావారిసాయుధనౌకలు తిరుగుచుండుటయు జరుగవచ్చునని తెలిసినవారలనుచున్నారు-

### అమెరికా యుద్ధ పరిశ్రమలలో కార్మికులసమ్మెలు

అమెరికాలో యుద్ధపరిశ్రమలందు కార్మికులు ఎక్కు-వజీతములను సాధించుకొనుటకై సమ్మెలు కట్టుటఅధికమైనది-బొగ్గునిర్మాణ పరిశ్రమలో కార్మికులసమ్మెను నవంబరు౧౭వతేదినాటికి సర్దిచేయుసరికి పెలిఫానునడిపించు కార్మికులు ౧౫౦౦౦మంది నవంబరు౧౫వ తేదిన సమ్మెకట్టవలెనని అకార్మికులనాయకులు నిర్ణయించినారు, ఈకార్మికులు తమ జీతాలను హెచ్చించవలెనను చున్నారు. ఇట్లే అయిదురైల్వేలలో ౩౫౦౦౦౦మందికార్మికులు నూటికిపదిహేనంతువజీతాలహెచ్చింపునకొరకై డిసెంబరు ౭వతేదినాటికి తమకోరికలు తీర్చబడనిచో సమ్మెకట్టునట్లు నిర్ణయించుకొన్నారు-బొగ్గుగని పనివారల సమ్మెను శాంతిపరచుటకై రూజ్వెల్టుగారింకను ప్రయత్నించుచునేయున్నారు.

మరియు అమెరికాలో నాజీలదుష్ప్రచారమువల్ల అమెరికాసేనలో పనిచేయు బాలురకు భోజనముసరిగాలేదనియు, వారలఆరోగ్యమువిషయమై శ్రద్ధవహించబడుచుండుటలేదనియు, ఆబాలురతల్లిదండ్రులు భయపడుచు సైనికాధికారులకు వ్రాయుచున్నారు- అమెరికాలో జర్మనునాజీలుచేయుచున్న కుట్రలకిది ఒకినిదర్శనముమాత్రమే-దేశమంతటను ఈ కుట్ర ప్రచారమువల్ల అల్లరిరేగవచ్చుననియు. అమెరికావారి యుద్ధపరిశ్రమలను కల్లోలపరచుటకుజర్మనుగూఢచారులుపన్నాగములుపన్నియున్నారనియుజనరల్ మార్షల్ అను అమెరికాసైనికాధికారినవంబరు౧౨వ తేదిన అమెరికనులకందరికిని హెచ్చరికచేసినాడు.

అయినను ఇపుడు అమెరికాయు బ్రిటనున్ను కలిసి జర్మనీలోను జర్మనులక్రిందదేశాలలోను తయారగుచున్న విమానాలసంఖ్యను మించినన్ని విమానాలనే తయారుచేయుచున్నారనియు,ఇంక ఒకసంవత్సరములోగా జర్మనులు తయారుచేయుచున్న దానికంటే మూడింతలెక్కు-వ తయారుచేయగల్గుదురనియు నవంబరు ౧౨వతేదిన వెండెల విల్కి-గారు న్యూయార్కు-లో చెప్పినారు.

### రష్యాకుతుర్కీ-ఆక్షేపణ

నవంబరు ౧౦ వతేదిన తుర్కీ-వారి నల్లసముద్ర భాగములో ఒకతుర్కీ-మోటరుబోటును రష్యావారిజలాంతర్గామియొకటి ముంచివేసినందుకు తుర్కీ-ప్రభుత్వమువారు రష్యాప్రభుత్వమువారికి ౧౨వ తేదిన ఆక్షేపణపత్రము పంపినారట-

మధ్యధరాసముద్రములో తుర్కీ-నౌకయొకటి మునిగినది- దానివిషయమైవిచారణచేయుటకుప్రభుత్వమువారు ఆజ్ఞాపించినారు- అందుచే ఇప్పటితుర్కీ-యుద్ధశాఖమంత్రియు, రాకపోకలశాఖమంత్రియు రాజీనామానిచ్చినారు- వారలస్థానములలో క్రొత్తవారుమంత్రులుగనియుక్తులైనారు-

### ఇరాను కథ

బ్రిటిషువారును, రష్యావారును కలిసి ఇరానుప్రభుత్వముతో ఒక క్రొత్తసంధి చేర్పాటుచేసికొనుచున్నారు-దానిప్రకారము ఇరానులో రాకపోకలసౌకర్యముల నుపయోగించుకొనుటకు రష్యా, బ్రిటనులకు అధికారము లభించగలదు- ఇందుకు ప్రతిఫలముగా ఇరానువారికిలభించెడి సౌకర్యాలిట్లున్నవి. ఇరానుకు పూర్తిఆర్థికసహాయము అవసరమైనపుడు పూర్తిసైనికసహాయము, అంతర్జాతీయపరిస్థితి బాగుపడిన వెంటనే ఇరానునుండి రష్యా, బ్రిటిషుసేన లన్నిటిని తొలగించెదమను గ్యారంటీ, ఇరాను స్వతంత్రరాజ్యమని మరొకసారి రష్యాబ్రిటనులు ఒప్పుకొనుట, ఇరానువారిని ఏవిధముగనైనా బాధించుచర్యలను రష్యా బ్రిటనులు కలిసి గైకొనదలచినపుడు ముందుగా ఇరానుకు తెలుపుట-ఇవిఇరానుపొందగలసౌకర్యాలట-ఇంకను క్రొత్తసంధిపత్రము అధికారరీత్యా ప్రకటించబడలేదుగాని పైసంగతులు నమ్మకముగా తెలియుచున్నవని విలేఖకుల వార్తలలోవచ్చినది.

## దసరాగల్లంతు

(ఒకవిలేఖరి)

జగిత్యాల, దై ౬

కరీంనగరుజిల్లాలోని జగిత్యాల తాలూకాలో దసరా ఊరేగింపుసందర్భమున ఒక మోటారుబండిలో కొందరుపిల్లలురొక్కి– గోవిందాగోవిందా అను కేకలతో వెళ్లుచున్నప్పుడుబండినినీను ప్రక్కనుంచివెళ్ళను–మసీదులో ప్రోగైన మహమ్మదీయులు దీనికితప్పుగాభావించి బండివాని పోలీసుమంత్రిజంగారికిచెప్పిరి. మంత్రిజంగారు దీనిని వారికిగాక "దసరా హిందువులపండగ కనుక వారు గోవిందగోవిందయనిఅరిచినారు. ఇది యొకతప్పుగాదు" అనిమహమ్మదీయులకు సమాధానమిచ్చిరి–మరదిగారు మెహతెమీంగారు కూడ యింతలోవిషయమై ఇచ్చటికివచ్చియుండిరి, ఇచ్చటిదసరా కార్యక్రమము గడిచినదని పైఅధికారులకు తెలియపరిచినట్లు తెలిసినది. కాని మహమ్మదీయులుమాత్రము ఊరుకొనక హిందువులపై నేరము మోపించుచుదరఖాస్తులను జిల్లా మెహతమీం పోలీసుగారికిని ఇంకపెద్దవరికో పంపిరి– బండిలో ఉన్నవారిని వదలిపెట్టి, గౌరవనీయులగు మరియు పలుకుబడిగలవారలగోమార్ల పేర్లను ఇతరయుళకుల పేర్లను దరఖాస్తులలో చేర్చిరి– దానిపై జిల్లాపోలీసు మెహతమీంగారు విచారణకై ఇచ్చటికివచ్చి ౪–౫ దినములు మొకాంపెట్టిరి– దసరాగడచిన నెలదినములతర్వాత మెహతమీంగారు పర్సాగాను చేయుటానికై ఆజ్ఞ ఇచ్చినారని తెలియవచ్చినది. ఇంతలో కొందరు పెద్దమనుష్యులు హిందూమహమ్మదీయ ఐక్యతకై ప్రయత్నించిరి. సులహనామాదాఖలు చేయుటానికై హిందువులుసమ్మతించిరి. కాని మహమ్మదీయులు వీరినిక్షమాపణపత్రము దాఖలుచేయవలసినదిగా బలవంతముచేయగా హిందువుల తరఫున క్షమాపణపత్రము దాఖలుచేయుడగా కేసుకొట్టివేయబడెను–

## ధర్మశాల ఉపయోగము బ్రాహ్మణులకేయట

రామేశ్వరుపల్లె, ౫–౧౧–౫౧

కామారెడ్డి తాలూకాలోచేరిన బిక్కనూరు రామేశ్వరుపల్లెకు ౬ ఫర్లాంగులదూరమున శ్రీ సిద్ధరామేశ్వరస్వామి యాలయము కలదు. ఆదేవాలయమునకు నిత్యము పలువురుభక్తులు పోవుచుందురు! ఈపోయిన జనుల నివాససౌకర్యమునకై యక్కడనే ధర్మాత్ములచే ధర్మశాలలు కట్టింపబడియున్నవి. వచ్చినవారు నాటికందు నివసించి దేవునిదర్శించి మరలిపోవుచుందురు. కార్తికశు॥ ౧౩ శనివారమునాడు మేమును సకుటుంబముగ దేవుని దర్శనమునకై చాలమంది వచ్చుటచే ధర్మగృహములలో కాళీచిక్కలేదు. అక్కడనే గౌరశెట్టి నారాయణ అనువారు కట్టించిన ధర్మశాలకుపోయితిమి. అదియంతయు ఖాళీగానే యుండెనుగాని తాళము వేయబడియున్నది. అట్లుండుటకు కారణమేమని యక్కడ నున్నవారినడుగగా అది బ్రాహ్మణులకుమాత్రమేయని తెలిసినది. ఇక మేము చేయునదిలేక దేవునిదర్శించి వెంటనే మరలితిమి. అక్కడి ధర్మశాలలో ఉన్నవారిలో చాలమంది చిరకాలమునుండి అక్కడ కాపురముగనే యుండిరట. అగంతుకులగు భక్తులకై యుపయోగింపవలసిన ధర్మశాలకు ఏండ్లతరబడి కాపురస్థలముగ చేసినచో జనులకు మిక్కిలి యసౌకర్యము కలుగుచున్నది. కనుకప్రభుత్వపు ధర్మాధికారులు దీనిని విచారింపచేసి జనసామాన్యమునకు మేలుచేయుదురుగాక!

ఇట్లు విధేయుడు

జి. నారాయణరెడ్డి

### ఆదర్శ వివాహము

[వి–వి] మిర్యాలగూడెం. దై ౫

శ్రీవృషసం॥ కార్తీకబ॥ ౪ లు ఆదివారము సాయంకాలము ౪ గంటలకు స్థానికశివాలయములో మిర్యాలగూడెం ఆర్యవైశ్య వితంతువివాహ సేవాసంఘమువారి యాజమాన్యమున వితంతువివాహము అతివైభవముగాజరుపబడెను వరుడు శ్రీయుత పొట్టుముత్త కోటయ్య. వధువు శ్రీయుత వడిగాల అంతయ్యగారి కుమార్తెయగుచి॥ సౌ॥ లింగమ్మ ఈవివాహమునకు స్థానిక ఆర్యవైశ్యసోదరులు. పురప్రముఖులును. వకీల్లును, సూర్యాపేట వైశ్యప్రముఖులు దాదాపు ౫–౬ వందల స్త్రీలును, పురుషులునువిచ్చేసి వధూవరులను ఆశీర్వదించిరి. స్థానికఆర్యవైశ్య పురోహితులచేతనే యాజ్ఞకముజరుపబడెను.

## ఖమ్మంవర్తకులపై అభియోగము

[ఒ–వి.] ఖమ్మంమెట్టు ౫–౧౧–౪౧

ఖమ్మంమెట్టు వర్తకసంఘమువారిపై స్థానిక పోలీసులు హైదరాబాదు ప్రజాశాంతిరక్షణచట్టం ౨౬–౬ సెక్షనుక్రింద స్థానిక న్యాయాధిపతివద్ద ౧౯వ అక్టోబరువాడు దాఖలుచేసినకేసు నేడు విచారణకువచ్చినది. సంఘపక్షమున సుప్రసిద్ధ న్యాయవాదులును, ఆంధ్రనాయకులగు శ్రీ బూర్గుల రామకృష్ణారావు బి.ఎ. యల్. యల్. బి. గారు [హైదరాబాదు]ను స్థానిక న్యాయవాదులలో శ్రీ కటకల రాజారాంరావు, వనంకోటి లింగం గార్లు పనిచేయుచున్నారు.

పోలీసువారికోర్టులో నేరస్థులపైన తెలుగునందితర్జుమాలోనికితర్జుమాచేసి దాఖలుచేసిన నేరారోపణకాగితము తర్జుమా సరిఅయినదికాదని సంఘపక్షపు న్యాయవాదులు కోర్టువారికివిన్నవించుకొనిరి– అందుపై కోర్టువారు తిరిగి సరియగు తర్జుమా చేయుటకై స్థానిక న్యాయవాదులగు శ్రీ ఇటికాల వెంకటరామేశ్వరరావు, జమలాపురం వెంకటేశ్వరరావు గార్లను మరియు పోలీసు ఉద్యోగి కోటేశ్వరరావుగారిని నియమించిరి. తిరిగి విచారించుటకు నవంబరునెల ౧౫వ తేదికి వాయిదా వేయబడెను–

## ప్రభుత్వమునకు రైతులవిజ్ఞప్తి

(ఒకవిలేఖరి,

జాజిరెడ్డిగూడెం దై ౪

సూర్యాపేట తాలూకాలోని జాజిరెడ్డిగూడెంలో గ్రామగ్రంథాలయమునందు రైతులు, ఇతరగ్రామజనులు సూర్యాపేటతాలూకా ఆంధ్రమహాసభ ఆర్గనైజరుగారి ప్రోత్సాహమున దైనాలుగవతేదిన సాయంకాలమునసమావేశమైరి. పత్తిత్తులంపస్పు దారుతెలలో నమోదుకానున్నమాఫీల విషయమై మాల్గుజారికాఖాధికారిగారికిని,జిల్లాతహ్సీల్ తాలూకాదారుగారికిని,తహసీల్దారుగారికిని మహజరువ్రాయించి, సుమారు ౫౦౦ మందిరైతులసంతకములనుచేయించిరి

### బంగారమునకై బాలహత్య

(ఒకవిలేఖరి)

ధర్మారావుపేట (కామరెడ్డితాలూకా) దై ౬

౨౮ అజూరు ౧౩౫౧వ మా గ్రామమునకు ౪మైళ్ళదూరములో కరెట్లపల్లి తా॥ గాంధారియిలాకా సామేనగాలో పాతవెంకయ్యకనూ ఆయగు చందమ్మఅను ౯ సంవత్సరముల బాలికపై ౩౦ తులాలబంగారునగలుండెను సాయంకాలము ౫ గంటలకు రుద్రాక్షపూవులకై అవుసులనర్సిమ్హులఇంటికిపోయినదట. తిరిగి ౭గంటలరాత్రివరకురానందున బాలికతల్లిదండ్రులు వెదకుటకు ఆరంభించిరి ఇంతలోఅవుసుల నర్సిములు ఇంటివెనుక పెంటలోశవముదొరికినందున పోలీసుపటేలువచ్చి అవుసులనర్సిములు ఇద్దరుకొమారులను పట్టుకొని అమీనుగారికితెలిపిరి. అమీనుగారువచ్చి అవుసులనర్సిమ్ములుఇంటినుండి నగలుతెప్పించి వారిద్దరిఅన్నదమ్ములను రిమాండులోఉంచినారు. వీరివయస్సు సుమారు ౧౪,౧౬ సంవత్సరములుండును. వీరినాయనలు కిష్టయ్య, అక్కమ్మ–తెదుపరి డాక్టరుగారువచ్చి శవపరీక్షచేసి దహనమునకు అజ్ఞయిచ్చిరి.

### ముస్తాబాదు గాంధిజయంతిలో వడికినదారపు వినియోగము

(ఒ–వి)

౨వఅక్టోబరుమొదలుగ ౯ వఅక్టోబరువరకును, ముస్తాబాదు, సిరిసిల్లాతా॥ గ్రామమున గాంధీజయంతి వస్తాహముజరుపబడినది. ఈసప్తాహమందు పెంగవారలొక చరఖాయును, అదనాదరొకచరఖాయును ర్యాత్రింబవళ్లుఃడిపించిరి. మొత్తము ౩౭౦౦౩౪ గజముల దారముతీసిరి. ౧౭ మంది పురుషులు ౧౫౩౭౦ గజములు, ౯ మంది స్త్రీలు ౧౯౭౭౪ గజములుతీసిరి.

ఇట్లుతీసినదారమంతయు గాంధీజీకి పంపవలెననియుద్దేశించినను. పునరాలోచనచేసి జయంతిదారము గాంధీజీకిపంపుట కంటెదబ్బును ముస్తాబాదు గ్రామపుదబ్బును బయటికిపంపుటగాంధీజీ గ్రామస్వయంపోషణ స్వయంరక్షణాసిద్ధాంతములకు వ్యతిరేకమని గహించుచు, కార్యకర్తలగు అన్న నరసింహారెడ్డి రాజారెడ్డి గార్లుయుదే దారముతో వస్త్రములయారుచేసి, అమ్మి, హరిజనులకు చరఖాల కొన్నియాయనిశ్చయించిరి.

## గ్రామజనసంఘస్థాపన

[స్వ–వి.] సూర్యాపేట. నవంబరు ౩౦–౧౧–౫౧ తేదిన అంధ్రవిజ్ఞాన ప్రకాశిని గ్రంథాలయములో అంధ్రగ్రామజన సంఘము సూర్యాపేట సమావేశమైనది– అసమయమున పాల్గొనిన ముఖ్యులలో శ్రీ అమృతరెడ్డి వకీలు మరియు శ్రీయుతులు అమరవాది వెంకటనర్సయ్య, యాములక్ష్మయ్య యామరావు నర్సయ్య సుబ్బారావు [ఆర్గనైజర్] గార్లు గలరు. సుమారు వందమందిహాజరైరి. ఏక గ్రీవముగ ఈదిగువకార్య నిర్వాహకవర్గము యెన్నుకోబడెను–

అధ్యక్షులు–శ్రీయుత అమరవాది వెంకటనర్సయ్యగారు కార్యదర్శి శ్రీకొట్టికోలవరదయ్యగారు,

ఈక్రింది తీర్మానములు అమోదింపబడినవి:–

౧. ఈసంవత్సరము కాలమున వర్షములేని హేతువుచే పునాసపైర్లు అనగా సజ్జలేయు పెసరఫలించనందున కర్షక కార్మికులు మిగులక్లిష్టపరిస్థితులయందుకొనవలసివచ్చినది. కానదయామయులగు ప్రభుత్వమువారిని పునాసశిస్తులను మాఫీచేయుటకుగాను కోరుచున్నాము–

౨. రాత్రిపగలనక అలసటలేక కష్టించు కష్టజీవులు తమ బీదరికమువలన సర్కారీపాఠశాలలకుపోయి విద్యనభ్యసించుటకు అవకాశములేక అవిద్యలో మునిగియున్నారు– కాన గ్రామజనసంఘమునుండి ఒకరయోజనపాఠశాల తెరచుట అత్యవసరము. ధనముచేకూరువరకు సాకార్యదర్శియగు శ్రీ అవంతుల రామలింగముగారు ఉచితముగ విద్యచెప్పుటకు సమ్మతించినారు–

గ్రామజనసంఘములో స్థానిక రైతులునుమారు ౧౦౦ మంది సభ్యులుగా చేరినారని సా॥ కార్యదర్శిని విచారించగ తెలిసినది.

సవరణ.

౩–౧౧–౪౧ నాటి గోలకొండ పత్రికలో వయోజనపాఠశాల తెరచుటనుగాను మాసూర్యాపేట ఆంధ్రజనసంఘ సమావేశసంఘములోచేసిన తీర్మానమును జి॥ ఆంధ్రజనసంఘమునుండికోరిన ఆర్థికసాహాయము నూరురూపాయలుకుబదులుగ వెయ్యిరూపాయలు పొరపాటున ప్రకటించేయబడినది– గానపాఠకులు సవరించుకొనెదరుగాకయని ప్రార్థన.

### ఆంధ్రవిద్యార్థి వసతిగృహ స్థాపన

సూర్యాపేట

మాతాలూకాలో మేము శ్రీయుత డా॥ జె–హెచ్. విశ్వనాథశర్మ గారి సహాయముతో కొందరివిద్యార్థులతో సమితిగ ఈర్పడకోట్ల వలన పడుయిదుములనుండి విముక్తిచేయతలచినాము. ఇట్లు శిక్షణ ౩౦ విద్యార్థులుకూడిన సిమ్మట హాస్టలు స్థాపించుటకై పురప్రముఖులతోడుకై వారికివి ఒప్పిచేయ సంకల్పించాము. ౧౪ అజార్ ౫౧ఫనుండి ఈకార్యక్రమము అచరణలోకి తెచ్చినాము, మొదటినెల ఇరువది మంది విద్యార్థులు మరియు ౩వ నెలవరకు ౧౪గురుచేరినారు– ఈవిద్యార్థిసంఖ్యయే మాపై కోరికనెరవేర్చుటకు తోడ్పడినాయకుల సానుభూతిసంపాదించినది.

వివరములకు "కార్యదర్శి, అర్జునపుస్తకభాండారు, సూర్యాపేటకువ్రాసి అభిలాషులు తెలుసుకొనగలరు–

## ఖాన్గీబళ్లపైఒత్తిడి

[ఒ–వి.] కేశోండ ౫ దై

కేశోండ గ్రామము కరీంనగరు తాలూకాలోనిది. జనసంఖ్య [౨౦౦౦]కు గృహసంఖ్య[౪౦౦] కుమించిగలదు. ఈగ్రామములో కొన్ని సంవత్సరములనుండి రెండు ప్రజా పాఠశాలలును, మరియుఒక ప్రభుత్వసహాయ పాఠశాలయు కలవు. మూడునాలుగు సంవత్సరములనుండి సర్కారి ఉపాధ్యాయులు యుద్ధముచేయుచున్నాడు– ప్రస్తుతముఒక ముసల్మానుపంతులు వున్నారు. అతడు ఖాన్గీపాఠశాలలలో విద్యనభ్యసించే పిల్లలను బలాత్కారముగా తనపాఠశాలకు తీసికొనిపోవుచున్నారు. ఖాన్గీబళ్ళను తీసివేయించెదనని యును ఖాన్గీపంతుల్లను చాలాణ్ చేయించెదనని యును భయపెట్టుచు పిల్లలతలిదండ్రులనుతనబడిలోకిపంపుటకు నిర్బంధించుచున్నారు. పైరెండు ఖాన్గీపాఠశాలలలో ఒకపాఠశాలకు ప్రభుత్వపుఆజ్ఞకూడ లభించినది రెండవదానిగురించి విద్యాశాఖాధికారులకు ఆజ్ఞకొరకై విజ్ఞప్తి సమర్పించుకొనైనది

ఇట్లు,

పరాంకుశం రంగనాధస్వామి కేశవస్వామి

ఖాన్గీపాఠశాల ఉపాధ్యాయులు

కేశోండ గ్రామముతా॥ కరీంనగరం

# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర కార్తీక బ॥ ౧౩ సోమవారము


## విద్యా పద్మవ్యూహము

బైబిలులోని పూర్వభాగములో ఒక కథకలదు. ఆదికాలములో ప్రపంచ జనులంతా ఒకేభాష మాట్లాడుచుండిరట. అందుచేత వారిలో మంచిఐకమత్యముండేదట. అందరిదీ "ఒకేమాట" ఇంక వివాదాలకు తావెక్కడిది? వారంతా ఒకమారు కలబలుకుకొన్నారు, మనము స్వర్గలోకానికి మెట్లుకట్టి దేవునివద్దకు సులభంగా వెళ్లేదానికి రాజమార్గం స్థాపించుదాము అని. సరేఅంటే సరే అనుకొన్నారు. మెట్లుకట్టుటకు ప్రారంభించినారు. చాలా యెత్తువరకు నిర్మించినారు- స్వర్గంలోఉండేజగజ్జనకుడువీరి "యెత్తులు" చూచినాడు. మానవులకు గర్వం పెరిగిపోయింది. వారు నాస్థానానికే ముప్పుతెస్తున్నారు. వారికి మంచిశాస్తి చేయవలెను-అని సంకల్పించుకొని వారిపై ఒక భాషా వృక్షానికి నానాశాఖలను కల్పించినాడు. మానవులకు ఒకరిమాట ఒకరికి అర్థముకానట్లుగా, ఒకటిఅంటేఒకటి అర్థముఅయ్యేటట్లుగా చేసినాడు. కట్టరా అని ఒకడంటే ఇంకొకడుదాన్ని పడగొట్టినాడు. ఒకడుఇటికతేరాఅంటేఇంకొకడు నీళ్లు అందించినాడు. ఈవిధంగా ఆమెట్ల బంగ్లా కూలిపడింది. అందరూకలహించుకొన్నారు. పర్యవసానం ఏమంటే లోకంలో వివిధభాషలు పుట్టెను. వాటినే బేబెల్ అన్నారు. ఈ బేబెల్ మూలాన జనులలో చీలికలేర్పడెను.

ఈకథ కల్పితమనుటలో సందేహము లేదు. కాని ఈనాడు మనహిందూస్థానములో మాత్రం ఈ బేబెల్ మంచివినాశనకృత్యముకావించుచున్నది. నాభాషే శ్రేష్ఠము, నాదే ఉత్కృష్టం, నాభాషనే మీరంతా నేర్చుకోవలెను, నాలిపియే శ్రేష్ఠం, నాదేమంచిలిపి- నాదినేను వదలనుకదా పైగాఇతరులునేర్చుకొనితీరవలె- అని ఏదిక్కుచూచినను బేబెల్ ధ్వనులు చెవులు గింగురుపోవునట్లుగా చెలరేగియున్నవి. ఈ హిందూదేశపు బేబెల్ ఆర్భాటములో హిందీ, ఉర్దూ భాషలు అగ్రస్థానము వహించియున్నవి.

పూర్వం మహాభారతయుద్ధంలోశత్రు దుర్భేద్యముగాను దురవగాహముగాను ద్రోణాచార్యులవారు పద్మవ్యూహమును పన్నిరి. దాన్ని తెలిసినవాడు అర్జునుడొక్కడే. అతడప్పుడు యుద్ధరంగములో లేకుండెను- ఇక సగము తెలిసినవాడు అభిమన్యుడొక్కడే- అతడు తండ్రివలన పద్మవ్యూహములో జొరబడేది తెలిసికొనియుండెనట. బయటకువచ్చేదిమాత్రం ఎరుగడు. ఐతేనేమి? నీవు దాటలేము, మేము వెనుకనుండివచ్చి శత్రువులనుధ్వంసంచేస్తాము- అని అన్నారు భీమాదులు. సరేఅన్నాడు బాలుడైన అభిమన్యుడు. ఆపద్మవ్యూహంలోఇరుకుకొనగా మొదటికి వారే యమునాతీరే అయిపోయినారు.

మొగలాయి చక్రవర్తులకాలములో "భూల్ భులియా" అను పద్మవ్యూహము వంటిదొక నిర్మాణమును ఢిల్లీలో కట్టియుండిరని చెప్పుకొంటారు. అదెంత నిజమోయేమో కాని మన హైద్రాబాదులో మాత్రం బషీర్ బాగులో ౨౯ ఏండ్లక్రిందట ఎత్తైన గోడలతో ఒక "భూల్ భులియా"కట్టియుండిరి- దానిలో ప్రవేశించినతర్వాత సుమారు ఒకగంట కాలము తిక్కలేచిన వానివలె సందులు సందులుతిరిగి దైవాత్తుగా బయట పడవలసినదే. ఇవన్నియు నిర్మాణ వినోదాలు.

హిందూస్థానములో ఒకచిన్న మోతాదుపైన విద్యావిషయములో కూడా విద్యా కాంక్షులగు బాలాభిమన్యులకుగాను విద్యాపద్మవ్యూహాలను, భాషా "భూల్ భులియా"లను నిర్మించుచూ వచ్చినారు- మన హైద్రాబాదులోకూడా ఈ భూల్ భులియా మరింత తీవ్రరూపము దాల్చియున్నది.

ప్రతి దేశములోను విద్యయంతయు జనుల మాతృభాషలోనే నేర్పింతురు- ఉన్నత తరగతులలో తమ మాతృభాషకు సంబంధించిన ప్రాచీనభాషనొకదానినికూడా చదివింతురు- ఆ పరభాషలను చదువుటకై నిర్బంధములేదు. అభిలాషులగువారికొరకు పైతరగతులలో కొన్ని ఐచ్ఛిక పరభాషలను నేర్పించు ఏర్పాటు చేసియున్నారు. ఒక్కొక్క దేశములో ఒక్కొక్క భాష జనుల ప్రధాన భాషగాఏర్పడియున్నది. ఆంగ్లస్థానములో ఇంగ్లీషు, జర్మనీలోజర్మను, ఫ్రాన్సులో ఫ్రెంచి, జపానులోజపానీ, ఐర్లోఐరిషుభాష ఈవిధముగా ఏర్పడియున్నవి- అయితే కొన్ని దేశాలలో ఏకభాషకాక రెండుమూడు ప్రధానభాషలుకూడా కనబడుచున్నవి- స్విస్సు దేశములో జర్మను, ఇటాలియన్, ఫ్రెంచిఅనుమూడు ప్రధానభాషలున్నవి- ఇంకొకచిన్నభాషకూడాఉన్నది- రష్యాలో౧౦౦కి పైగా వివిధభాషలున్నవట! ఈరెంటిలో ఎట్లు భాషాసమస్యను విద్యాసమస్యను పరిష్కరించగలిగినారో కనుగొనుట, అదే విధంగా మన దేశములోను ఆచరణయందుంచుట, సమంజసముగా ఉండును. పై రెండు దేశములలో జనులు మాతృభాషలోనే విద్య చెప్పించుచున్నారు- ఏమండలములో ఏభాషప్రధానముగా ఉండునో ఆభాషరష్యావారు తమమండలాలలోనిజనులకు బోధించుచున్నారు. అంతేకాని రష్యాసామ్రాజ్యము రష్యావారిదికాన రష్యాభాషకే అంతటనుప్రాధాన్యతనిచ్చితీరవలెననివారు పట్టుపట్టలేదు స్విస్ దేశము (స్విట్జర్లాండు) లో మూడుభాషలకును సమానస్థానమిచ్చినారు- ఏమండలములో ఏభాషఎక్కువగాఉన్నదో ఆభాషలోనే చదువుచెప్పించుచున్నారు అట్లాయితే ఉద్యోగాలగతేమయ్యా? అనికొందరు ఉద్యోగాలకే జీవితమర్పించువారు, విచారించవచ్చును- విద్యనుఉద్యోగాలకై ఒకభారతదేశమందుతప్ప మరేదేశమందును చెప్పించుటలేదు- మనదేశవిద్యార్థులలో బహుసంఖ్యాకులకువిద్యయొక్క ప్రధానోద్దేశముప్రభుత్వోద్యోగమే! మణుముబంగారు ఉంచుకొనేదానికన్న మాసంఅధికారం ఉంటే చాలును అని తెలంగానాలో జనులనుచుందురు- స్విస్సురష్యాదేశములలో మాండలికభాషలునేర్చినవారికిమాండలికోద్యోగాలిచ్చుచున్నారు- స్విస్సు దేశములోని శాసనసభలలో ఇటాలియన్, ఫ్రెంచి, జర్మనీ, అనుమూడుభాషలలోనూ సభ్యులుమాట్లాడవచ్చును- అవిధముగానే వ్యవహారములు జరుగుచూఉన్నవి-

మన దేశములో ఉర్దూలిపియే ఉండవలెను- కాదునాగరలిపియే ఉండవలెను, అని సుందోపసుంద ద్వంద్వయుద్ధాలు పత్రికలలోజరుగుచున్నవి- కాని తుర్కీదేశములో గాజీముస్తఫా కమాల్ పాషాగారికాలములో తుర్కీలిపిని అమాంతముగా ఒకేనాడుఎత్తిపారవేసి ఇతరయూరోపు ఖండమందంతటను వ్యవహారములోఉన్న రోమక (రోమన్ లేక ల్యాటిన్) లిపినివ్యాపింపజేసిరి- ఖురానె షరీపును తుర్కీభాషయొక్క పరివర్తనముచేయించి తుర్కీభాషలోనే ఆ గ్రంధపఠనమును చేయించుచున్నారు. ఈవిధముగా ఆదేశములో జనులసౌకర్యానికి మతముకాని, ఆవేశముకాని, అనువంశికాచారముకాని, ఏమాత్రమును అడ్డురాలేదు. వారుమతోద్రేకముతోకాని సంకుచితదృష్టితోకాని యీసమస్యలను పరిష్కరించుకోలేదు.

ఇక మన హిందూస్థానములోని కథను చూడండి. మనఅదృష్టముచేతనో దురదృష్టముచేతనో మనకును ఇంగ్లీషువారికిని లంకెఏర్పడింది. మనమువారికిలోబడిన దాసులము. అందుచేతవారిభాషను మనమునేర్చుకొనవలసి వచ్చెను- ౧౨౦ఏండ్లక్రిందట హిందూస్థానములో ప్రాచ్యపాశ్చాత్య పండితులవిద్యాయుద్ధముజరిగెను- హిందూస్థానములో దేశభాషలో విద్యచెప్పించవలెనా లేక ఇంగ్లీషుభాషలోవిద్యచెప్పించవలెనా అనుసదిచర్చించబడెను- ఇంగ్లీషులోనే విద్యచెప్పించవలెనన్నవారిపక్షము గెలిచెను- దానిప్రధాననాయకుడు లార్డుమెకాలే. అతనుచూపినకారణమేమంటే "మనఇంగ్లీషుచదివితే భావిసంతతివారు ఆంగ్లమానసపుత్రులగుదురు- ఇకముందుభారతీయులకు తమభాషలు, తమదేవతలు, తమమతాలు, తమఆచారాలు అన్నీ మొరటుగాకనిపించును" అనిమెకాలేఅన్నాడు. దానిలో గొప్ప అంతరార్థమున్నది. పరభాషలను నేర్చువాడు ఆత్మీయసంస్కృతికి తిలాంజలిదర్పించుకొని పరభాషాసంస్కృతికి దాసవయగును. ఈవిధముగా మెకాలేపుణ్యమాఅన్నట్లు భారతదేశమంతను ఇంగ్లీషుప్రధాన భాషయయ్యెను, ఇంగ్లీషుభాషలోఏభాషకునులేని ప్రత్యేకత కలదు- అందువ్రాసేదొకటి కూసేదొకటి. ఎంతటిగొప్ప గ్రాజుయేటుఅయినా ఎంతనోరుతిప్పి నాలుకతిప్పి ఇంగ్లీషువారివలె మాట్లాడబోయినా భారతీయునికి ఇంగ్లీషుసరిగా రానేరదు. అట్టిభాషనుచదివిమనదేశముసంపాదించినదొక్కటే, అదిఉద్యోగజాతిని సృష్టించుట! అంతే!!

ఇంచుమించు ౨౦ఏండ్లనుండి భారతీయులుమేలుకొన్నారు-స్వభాషలలోవిద్య చెప్పించవలెనని తీవ్రాందోళనముచేసినారు. తత్ఫలితముగా హైస్కూలు అంతస్థువరకు మాండలిక భాషలలో ప్రధానంగా విద్యచెప్పించుచు ఇంగ్లీషునకుకూడా రెండవ ముఖ్యస్థానమిచ్చినారు. ఇంకను ఈపరివర్తనము క్రొత్త క్రొత్త రూపాలలో జనుల మాతృభాషలకు ప్రాధాన్యతనిచ్చుటలో అక్కడక్కడ మార్పులు జరుగుచున్నవి.

మన హైద్రాబాదు రాష్ట్రములోని విద్యాస్థితి ఒక ప్రత్యేక విశిష్టత కలిగియున్నది. ఇక్కడి ప్రధాన భాషలు నాలుగు. నూటిలో ౪౮మందిమాట్లాడు తెనుగు, ౨౬మంది మాట్లాడు మరాటీ, ౧౨ మంది మాట్లాడు కన్నడము, ౧౦ మంది మాట్లాడు ఉర్దూ అనునట్టివి.

హిందీభాషనుమాట్లాడుహిందువులు కొందరున్నారు. హిందువులకు తమభాషలకును మతానికిని సంబంధించినసంస్కృతం కొంతవరకు అవసరము. ముసల్మానులకు తమ ఉర్దూకు ప్రధానమైన ఫార్సీ భాషయు, మతసంబంధమగు అరబీభాషయు చాలా అవసరము. ఇంగ్లీషుభాష సామ్రాజ్య భాషయు, బ్రిటిషిండియా విద్యాపీఠాలలోని ప్రధాన భాషయు, ప్రపంచ వ్యావహారిక భాషయు, ఉత్తమ సాహిత్యముతో కూడినట్టిదియు అగుటచేత ఇప్పట్లో అపరిహార్యమైనట్టిది. ఇవన్నింటికిని హైద్రాబాదు విద్యావిధానములో స్థానముండవలసివచ్చినది. అనగా హైద్రాబాదు విద్యాపద్ధతిలో తెనుగు, మరాటీ, కన్నడము, ఉర్దూ, ఫార్సీ, అరబీ, సంస్కృతము, హిందీ, ఇంగ్లీషు అను తొమ్మిది భాషలకు స్థానమున్నదన్నమాట. దేనిదేని కెంతస్థానమున్నదను విషయముచర్చనీయము. మనవిద్యాశాఖవారును మన ప్రభుత్వమున్నూ అవలంబించుచున్నట్టి విద్యావిధానమునుగురించి ముందు చర్చింతుము. ఇది ప్రస్తావన.

## మన తరీసేద్యము

హైద్రాబాదు రాష్ట్రములోని తెలంగానాలోని తరీసేద్యమును గురించి పాఠకులు తమతమ అభిప్రాయములను తెలుపగలరు. వ్యాసకర్తలీ క్రింది విషయాలను దృష్టిలో నుంచుకొని సంక్షిప్తముగా వ్రాసి పంపవలెను.

౧. తరీపన్ను ఎక్కువగానున్నదా లేక సమంజసముగానున్నదా? కారణములతెలిపేది- బ్రిటిషిండియాలోని తరీపన్నులను తెలుసుకొన్నవారు వాటితో పోల్చిచూపగలరు.
౨. బావులక్రిందను, చెరువుకుంట కాలువలక్రిందనున్న తరీసేద్యములలోని భేదము.
౩. షైబందీలో ఇబ్బందులున్నవా? ఉంటే ఎట్లు తొలగించితే బాగుండును.
౪. చెరువుకుంట కాలువలక్రింద నీటిపన్ను ప్రత్యేకించుటబాగా లేక ఇప్పటిపద్ధతే బాగా!
౫. బావులక్రింది సేద్యముకలలాభమా నష్టమా? లేక రెండునుసమానమా? ఎవరైనను ఈసేద్యములోని ఆదాయవ్యయములను లెక్కలపట్టీలతో చూపించి నిరూపించగలరా?
౬. భూశాసనము (మాల్గుజారీఖానూను)లో తరీసేద్యముపాద్దువరకు ఏమైనమార్పు అవసరమా? దానివలన రైతులకేమేమి యిబ్బందులున్నవి? ఈసమస్యను వకీళ్లయినవారుకూడా చర్చించితే బాగుంటుంది,
౭. వ్యాసములు క్లుప్తముగా వ్రాయవలెను- తమ పేరులతో ప్రకటించుట కొప్పుకొనవలెను.

గో. ప. సం.

## కత్తిసాముచేసినందుకు శిక్ష

హైద్రాబాదునగరములో బాలాజీ [illegible] బొల్లక్క [illegible] కత్తి [illegible] ప్రదర్శనమున కత్తిసాము ప్రదర్శించిరి- ఇది నేరమని పోలీసువారు వారిని కోర్టులో విచారింప జేసిరి. కోర్టువారు [illegible] శిక్షయున్నూ ౨౦ రూపాయల అపరాధమున్నూ విధించిరి

## హైదరాబాదు ధరలు

తేది ౧౭-౨-౫౧ ఫ.

పల్లా ౧కి ౧౨౦ శేర్లతూకముధరలన్నీ హాలీశే.

| బియ్యము | పల్లా ౧కి ధర |
|---|---|
| | రూ ఆ పై |
| కిచిడిసాంబల్లు | ౨౪ నుండి ౨౫, ౨౬ |
| సంబల్లు | ౨౪ ౮ ౦ |
| ఢిల్లీబోగాలు | ౨౩ ౮ ౦ |
| రాంసాగర్లు | ౨౧ ౮ ౦ ౨౧౭ |
| నానక్రాం | ౨౨, ౨౩ కొత్తవి |
| ,, | ౨౩౭ ౨౪ పాతవి |
| అర్కాటి | ౧౧ ౮ ౦ ౨౧౭ కొత్తవి |
| ,, | ౨౨ ౮ ౦ పాతవి ౨౩ |
| గోనామణి | ౨౧ నుండి ౨౧౭ వరకు |
| బుడుములు | ౨౦ ౦ ౦ |
| దేశావరి | ౧౯, ౨౦, ౨౧ వరకు |
| **గోధుమలు** | |
| గద్వాల్ | ౨౨౭ ౨౧ |
| బన్సీ | ౨౧ – ౮ వరకు |
| అష్కారీ | ౨౦ ౮ ౨౧ |
| పోటియా | ౨౦ ౮ ౦ |
| ఎఱ్ఱగోధుమలు | ౧౯ ౧౯ ౮ |
| తెల్ల జొన్నలు | ౨౦ ౮ |
| పచ్చజొన్నలు | ౧౧ ౧౧ ౪ |
| శనగలు | ౧౯౭ ౧౯ వరకు |
| కందులు మ్యొరవి | ౧౧ ౮ |
| మినుములు | ౧౫ ౩ ౧౩౭౨- |
| అంకలు | ౧౫ – |
| సజ్జలు | ౧౨ ౮ ౧౨॥౦ |
| **పప్పులు** | |
| శనగ పప్పు | ౨౩ ౦ ౦ |
| కంది ,, | ౧౮ ౮ ౦ |
| పెసరశనగ ,, | ౨౧ ౨౨ ౮ ౦ |
| లంక ,, | ౧౯ । ౦ |
| మినుప ,, | ౧౯ ౦ ౦ ౧౩౭ |
| పెసర ,, | ౧౯ ౦ ౦ |
| బెల్లము | ౧౩ నుండి ౧౫, ౧౮ ౧౯ర. |
| ఉప్పు | ౧౨, ౧౧ ౮ ౦ |
| పుల్లిగడ్డ | ౧౬౭నుండి౧౧౭ |
| వరుగు మంచిది | ౪౫ వరకు కొత్తది |
| చక్కెర మణుము [౪౦ శేర్లు] | |
| జావా ,, ,, | ౧౪ ౦ ౦ |
| బొంబాయి ,, ,, | ౧౩ ౧౪ ౦ |
| మద్రాసు ,, ,, | ౧౩ ౧౫ ౦ |
| నిజామాబాదు ,, ,, | ౧౩ ౧౨ ౦ |
| ఎఱ్ఱచక్కెర ,, పల్ల | ౧౩, నుండి ౧౫ వరకు |
| దర్గచక్కెర ,, ౪౦ శే. | ౧౬ ౧౨ ౦ |
| ఎల్లిగడ్డ మణుము ౧౨ శే. | ౫ ౮ ౦ |
| అల్లం ,, ,, | ౨ |
| మణుము ౧౨ శే. | |
| కొబ్బరనూనె ,, | ౫ । ౦ |
| కుసుమనూనె ,, | ౫ ౦ ౦ |
| నువ్వులనూనె ,, | ౪ ౪ ౦ |
| వేరుశెనగనూనె ,, | ౪ ౦ ౦ |
| కిరోసిన్ (గ్యాస్), ,,డబ్బా ౧కి | ౪-౧౨-౦ |
| నెయ్యి మణుము ౪౦ శేర్లు | |
| బిరారు నెయ్యి ,, | ౬౫ ౦ ౦ |
| తెలంగానా ,, | ౫౫ ౦ ౦ ౫౦ |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ ౬ ౦ |
| ఆముదాలు బస్తా | ౯, ౧౧ ౦ ౦ |
| వేరుశెనగ ,, | ౭ ౪ ౦ |
| పప్పు ,, | ౧౨ ౦ ౦ |
| బంగారు తు॥ ౧కి | ౫౨ ౦ ౦ |
| వెండి ౧౦౦ తు | ౬౨ ౦ ౦ |
| ,, తు ౧కి | ౦౭౩౭ |
| సవరన్ ౧కి హాలి రూ- | ౩౩ ౧౨ ౦ |
| **మారకం** | |
| హాలీక కల్దార్లు | ౧౫ ౧౫ ౦ |
| కల్దారుకు హాలీలు | ౧౫ ౧౩ ౦ |

### బొంబాయి ధరలు

(నవంబరు ౧౪ వ తేదీన)

| | రూ. ఆ. పై. |
|---|---|
| కోచిప్రత్తి (ఏప్రిల్-మే వాయిదా కం(ట్రాక్టు) | ౨౩౬-౦-౦ |
| ఉమ్రాప్రత్తి (డిసెంబరు-జనవరి వాయిదా) | ౨౦౦-౦-౦ |
| ,, ,, (మార్చి వాయిదా) | ౧౯౧-[illegible]-౦ |
| (నవంబరు౧౪ తేదీన) | |
| వెండి (తయారు) తులాలు౧౦౦కి | ౬౩-౧-౦ |
| ,, (నవంబరు వాయిదాను.౧౦౦కి | ౬౨-౧౪-౬ |
| ,, (డిసెంబరు ,, ) ,, | ౬౨- ౪-౬ |
| బంగారు (తయారు) తు॥ ౧కి | ౪౩- ౪-౦ |
| ,, (నవంబరు వా॥) ,, ,, | ౪౩- ౪-౦ |
| ,, (డిసెంబరు ) ,, ,, | ౪౩- ౩-౬ |

గమనిక:- ధరలు నిత్యం శాయశక్తుల సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకాజాలరు,

# Golkonda Patrika

**Volu 16 — No 54** | *Published on every Monday and Thursday Hyderabad Dn.* | **17—11—1941**


## రష్యాలో జర్మనులింతవరకు సాధించినది

### హిట్లరుగారి ఉపన్యాసములో వివరణ

జర్మనీలో మ్యూనిచ్‌నగరమందు బీర్ హాల్లర్ భవనవిప్లవమును స్మరించుసందర్భమున నవంబరు ౯ వ తేదినహిట్లరుగారు మ్యూనిచ్‌నగరములో ఉపన్యసించుచు రష్యాలో ఇంతవరకు జర్మనులు సాధించినదానిని ఇక ముందుజర్మనుల యుద్ధాశయము ను వివరణచేసిరి-

యూరపుఖండముపై దండయాత్ర చేయుటకు రష్యావారు ఎత్తువేసినందువల్ల, తానుతనజీవితకాలములో ఎన్నడును చేసికొనియుండనంత కఠినవిర్ణయమును చేసికొనవలసివచ్చెనని వారుచెప్పి, శత్రురాజ్యములను నాశముచేయుటయు, శత్రువులకుపోవుచున్న యుద్ధసామగ్రులను ఆక్రమించుటయు తాముయుద్ధముచేయుటకు మూలోద్దేశ్యములనుడివిరి-

ఇంతవరకు ౩౬,౦౦౦౦౦ రష్యాసైనికులు తమకు చిక్కినారనియు, మృతులును క్షతులునుకూడచేరినచో మొత్తము ఒకకోటిసైనికులు రష్యావారికి నష్టమైనట్లునియు చెప్పిరి- ఇంతేగాక చిన్నగాయాలయినవారలసంఖ్య చేరేయున్నదనిరి. ఇంతవఱకు మాసుండి ఏకేనగానితిరిగిలోబడి లేనిఅదరి- మరియు రష్యావారివి ౧౫౦౦౦ విమానాలు, ౨౨౦౦౦ టాంకులు, ౨౭౦౦౦తుపాకులు నష్టముచేయబడెను. ఇంతవరకుఇంగ్లాండుకు అయినంతటి పైశాల్యముగలభూమి రష్యాలో తమవశమైనదనిరి-రష్యావారిపరిశ్రమలలో నూటికి ౭౦ మొదలు ౭౫వరకు అభూమిలోనే తమకుచిక్కినవనిరి- "ఇప్పుడురష్యాను పీపుదిరుగగొట్టినంతకంటె స్వల్పతరకాలములో మరేబ్రహ్మాండమైనసామ్రాజ్యముగాని వీపుదిరుగగొట్టబడలేదు" అనివారనిరి-

లెనిన్గ్రాడుస్థితినిగూర్చి వారిట్లుచెప్పిరి- "ఇప్పుడు మేము ఆత్మరక్షణయత్నములోనున్నాము- ఎదుటిపక్షమువారు మమ్ములను ఛేదించుకొనిపోవలసియున్నది- కాని వారులెనిన్గ్రాడులోనే నిరాహారులైపోవగలరు- ముఖ్యముగా అవసరమైనపేసిసమిచ్చి ఒకసైనికునైనను అదనముగానే నష్టపరచుట్వను అవివేకము- ఆ నగరముచుట్టును ముట్టడించబడియున్నది- మరెవరును దానివిడిపించజాలరు- అదిమాకు తప్పకవశముకాగలదు. కేవలము తిథులనుబట్టిగానే వశమగునని చెప్పచో, అటులేకానిండు- లెనిన్గ్రాడు ఒకపట్టణమనిమాకుఆశలేదు- అదిపరిశ్రమలనిలయము కాబట్టి దానిని ధ్వంసముచేయవలెననిరి. నాశయమే- తమనగరములనుతామే ధ్వంసముచేసికొనుటకు రష్యావారుకలచుచో,మాకుకొంతపనితప్పును" మరిజర్మనులెందుకు ముందుకునడచిపోరాదు! అనుప్రశ్నకుసమాధానమిచ్చుచు హిట్లరుగారుఅందుకు కారణమిప్పుడు అక్కడవర్షము అపడుచుండుటయో, లేక మంచుపడుచుండుటయో, లేదా రైలుబాటలు పూర్తికాకుండుటయోకారణమనిచెప్పిరి-

బ్రిటిషువారు యూరపుఖండముమీదికి దండెత్తవలెనని కోరుచేయుచున్న సూచనలను గురించి హిట్లరుగారిట్లుచెప్పిరి: "నార్వేలోగాని, జర్మనుసముద్రతీరమునగాని( హాలెండులోగాని, బెల్జియంలోగాని, లేక ఫ్రాన్సులోగానిదిగిదండయాత్రచేయగలెవని ఇంగ్లీషువారికిష్టమున్నచో రండి'యనివచ్చినంతకంటె ఎక్కువకేమియుగానహారిపోగలరు అనిమాత్రమే మనము చెప్పగలము"

జర్మనీలో ప్రజలుతిరుగుబాటుచేసెదరని చేయుచున్న ప్రచారప్రవచనములను ఖండించుచుహిట్లరుగారు అంతకంటెఅసంగతమైనదేదియు లేదనిరి- "యుద్ధముఎంతకాలమైనను జరుగుగాక, రంగమందు కట్టకడపటిసైనికదళముకూడజర్మనులతోనిండినదేఅయి ఉండును" అనివారనిరి-

దక్షిణఅమెరికాను చీలికలుచేయుటకును మతములను లేకుండచేయుటకును హిట్లరుసంకల్పించియున్నారని మాజెస్టుగారుచెప్పినమాటలు చిన్నపిల్లవాడు తెలివితక్కువమాటలని హిట్లరుగారుచెప్పిరి- అమెరికాకోడలనుచూడగానే జర్మనునౌకలపైనుండువారలు వాటిపై దెబ్బవేయరాదనియు, ఎదుటివారలు తమపైదెబ్బవేసినచో ఆత్మరక్షణచేసికొనవలెననియు తామాజ్ఞాపించినట్లు వారు తెలిపిరి-

యుద్ధమువల్ల తామాశించుచున్న ప్రయోజనము ను గురించి వారిట్లుచెప్పిరి: "ముసోలినిగారును, నేనును ఒక ప్రతిజ్ఞ చేసియున్నాము-దానిని ఈ భూమిపై ఎట్టిశక్తియు భగ్నము చేయజాలదు-నేను యూరపుఖండపు ఆగ్నేయభాగము దాదాపుగాంతయుత్తరభాగములో చాలవఱకుయూపశ్చిమమనమున్నది-యూరపుగతి రాబోవు వేయిసంవత్సరములవరకు నిర్ణయించబడుచున్నది- మా ఆత్మయును ఒక్కటియే- మాపట్టుదలయును

## ముస్లింముఖ్యులు హైదాబాదుకు వచ్చుట

హైదరాబాదునగరమునకు సర్ సికిందర్ హయాత్ ఖాన్ గారును డాక్టర్ సర్ జియావుద్దీన్ గారునువచ్చినారు. ఇంకను ఒకరిద్దరు గొప్పవారురానున్నారని అనుచున్నారు. సర్ మిర్జాఇస్మాయిల్ గారుకూడా నేడురానున్నారట. ఫజ్లుల్ హక్ బెంగాలుప్రధాని రానున్నారనివింటున్నాము. ఇందరుపెద్దలు ఒకేతడవవచ్చుట ఎందులకోఅని నగరవాసులు పరిపరివిధాల ఆలోచనలుచేయుచున్నారు.

సర్ సికిందర్ హయాత్ ఖాన్ గారు తమసహాయకులైన అబ్దుల్ లతీఫ్ అనువారిని వెంటతీసుకొనివచ్చినారు, ప్రభుత్వాధికారులు వారికిస్టేషనులో స్వాగతమిచ్చిరి వారుశుక్రవారమునాడువచ్చిరి. అదినమేమక్కామసీదులో నమాజుచేసిరి. నమాజుఅనంతరము మక్కామసీదులో ఉపన్యాసమిచ్చిరి హైదాబాదురాజ్యానికి ఉత్తమవిజ్ఞానవంతుడగుప్రభువుగారు లభించినందులకు అందరును సంతోషించవలెననియు శ్రీవారిఆధీనములో అందరును ఐక్యతోనుండవలెననియు బోధించిరి. సాయంత్రము ముఖ్యులగువారితోమాట్లాడిరి. తర్వాత హి-ఘ-హ-నిజాంప్రభువుగారిని దర్శించుకొని శ్రీవారితో ౧ గంటకాలముమాట్లాడిరి-

మరునాడుఉస్మానియా విద్యాపీఠమునుతిలకించిరి- అచ్చట బంగ్లాలున్నగునవి ఎంతచూచినను తనివితీరదనియు తమకుఎక్కువకాలము లేకపోయెననియుతెలివిచ్చి అరగంటకాలముండిరి తర్వాత శ్రీయువరాజుగారినిదర్శించుకొనిరి శనివారమునాడు మరలనారు హి-ఘ-హ-నిజాంగారిని దర్శించుకొని ఒకగంటకాలముమాట్లాడిరి. రాత్రివారిగౌరవార్థము గౌ॥ రెసిడెంటుగారు విందుచేసిరి-

డాక్టర్ సర్ జియావుద్దీన్ గారు హి-ఘ-హ-నిజాంగారిని శనివారమునాడుకలిసిమాట్లాడిరి.

... ... ...

ఇకముందు హైద్రాబాదునుండి మొత్తము ఇండియాకును బయటిదేశాలకును ముసల్మానుల పండుగులఅవసరాలకై హాద్యమి చందమామ యొక్క ఉదయకాలమునునిర్ణయించి రేడియో టెలిగ్రాములద్వారా తెలుపగలరు,

## శ్రీకృష్ణ దేవరాయల ఆంధ్రభాషానిలయంవారి కార్యక్రమము

౧౩-౧౧-౪౧ నాడు శ్రీచిదిరెమఠము వీరభద్రశర్మగారి అధ్యక్షతలో శ్రీనాథకవిత్వాన్ని గూర్చి వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు (పిఠాపురపండితులు) ఉపన్యాసం కావించినారు. ౧౭-౧౧-౪౧నాడు హైద్రాబాదునగర శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో శ్రీకాటికొండ అనంతరెడ్డిగారిఅధ్యక్షతలో పిఠాపురంశాస్త్రిగారును,ప్రతాపరెడ్డిగారును ఉపన్యసిస్తున్నారు. తర్వాత ఎన్నికలు జరుగును. ౧౮-౧౯-౪౧నాడు కవిసమ్మేళనం మహాకవి చిపురుల అప్పయ్యశాస్త్రిగారి అధ్యక్షతలోజరుగును. ప్రతిదినంసాయంత్రం ౫.౩౦ నుండికార్యక్రమంజరుగును.

నిజాంకాబీనా మంత్రిగారు దిండిఅనకట్టవుం ధైనతాలూకా పనులువల్లగొండ ఖమ్మంతాలూకాల పనులు తనిఖీచేయుటకై పర్యటనంచేయుచున్నారు. ౧౯వ నవంబరునాడు హైద్రాబాదుకు తిరిగిరానున్నారు-

యూరపు ఖండమునకును, దానిచెంపల మాయంతటీదరికములో నున్నవారలకును ఇదివర్తించును-బెర్లినునగరము ప్రపంచరాజధానిగ నుండబోవుటలేదు."

ఈహిట్లరుఉపన్యాసము బ్రాడ్‌కాస్టు చేయబడలేదు-అందువల్ల మొదట ఆ ఉపన్యాసమును గురించినవార్తలన్నియు ఒక్కటితీరునలేకుండనవి, జర్మనీఅధికారులద్వారా ప్రకటనకండజేయబడిన ఉపన్యాసప్రతి ఆలస్యముగా ఇవ్వబడినది-అందువల్ల మొదట నోటితో చెప్పిన ఉపన్యాసమునందు అధికారులు సవరణలేమైన చేసియుండవచ్చునని ఊహించుటకు అవకాశమున్నదని రూటర్ ఏజన్సీ సూచించినది.

## నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభ

### కార్యకారిణీసభాసమావేశము

హైద్రాబాదు, ౨౦౧౨

నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభా కార్యకారిణీ సభాసమావేశము ౧౦, ౧౧,౨౨ ౧౩౫౧ ఫ. శుక్రవారములందు స్థాయిసంఘకార్యాలయమునందు సాయంత్రము ౫౦. ౫లకు శ్రీరావినారాయణరెడ్డిగారి అధ్యక్షతనజరిగెను- ఆసందర్భమున ఆంగీకరింపబడినతీర్మానములు;

తీర్మానము ౧: స్థాయిసంఘ సమావేశమునకై ౧౬-బహిమన్ ౧౩౫౧ నిశ్చయించుచు స్థలనిర్ణయమునకై స్థాయిసంఘాధ్యక్షులవారిచేకార్యదర్శులవారికి అధికారమివ్వబడెను-

తీర్మానము ౨. (౨౪ ౨౧౩౫౧) తెలంగాణమునందు "డిపెన్స్‌డే"జరుపుటకు నిశ్చయించుచు, పైతేదీయందు జిల్లా, తాలూకాసంఘములనుండి టెలిగ్రాములు జనబాహుళ్యమురొక్కసంతకములతో మహాఘనత నిజాంప్రభుత్వప్రధానమంత్రిగారికి పంపుటకు తీర్మానించుచున్నారు-

యిదేసందర్భమున రాజ్యాంగసంస్కరణము నుగురించిన ఒకప్రకటనను సిద్ధపరచి ఏకగ్రీవముగా అంగీకరించిరి-

### సవరణ

౧౮-౧౧-౪౧ తేదినాటి గోల్కొండపత్రికయందలి ౫వ పేజీలోని స్థానికవార్తల వరుసలో ౯వ వార్తయందు "కుమ్మరి బాలబ్రహ్మనందదాసు" గారిచే హరికథలుచెప్పబడుచున్నట్లు ప్రకటింపబడినది, కాని యదిపొరపాటువలన జరిగినది కావున "కుమ్మరి" యనుచోట "కొమ్మారి" అని సవరించి చదువుకొనవలెను. ఇట్టిపొరపాటునకు సంతాపమందుచున్నాము.

## గ్రుడ్డివారికి ఉచిత చికిత్స

### గౌ॥ అబ్దులజీజు మంత్రిగారి ఔదార్యము

హైద్రాబాదు రాష్ట్రములోని గ్రుడ్డివారు, కండ్లకు పొరలువచ్చినవారు కంటిలోపములు కలవారందరును ఉచితముగా చికిత్సాలాభమును పొందుటకై గౌ॥అబ్దులజీజు మంత్రిగారు చాలా అనుగ్రహంతో ఔదార్యంతో ఏర్పాటుచేసినారు-కండ్లచికిత్సకై రాయబహద్దరు డాక్టర్ మధురదాసు అనువారిని పిలిపించుచున్నారు- ఈ డాక్టరుగారు కేవలం హిందూస్థానమందేకాక జగత్తంతటను ప్రఖ్యాతికాంచినారు. హైద్రాబాదునగరంలో రాజ ప్రతాపగిర్జీగారి బంగ్లాలో చికిత్స యేర్పాటుచేయనైనది. వారం ౧౦దినాలపాటు జరుగును. ౩ డిసెంబరు౧౯౪౧ (రజబ్ మాహ ౧౩౬౦ఫ)నుండి వారం పదిదినాలపాటు జరుగు బీదవారికందరికిని ఉచితచికిత్స జరుగును. పైగా వారికి ఉచితముగాభోజనం, మంచి కంటి అద్దాలు, అన్ని సౌకర్యాలుకూడా జరుగును-కంటి ఆపరేషన్ కాని చికిత్సకానిజరిగిన కంటిరోగులు రాజాప్రతాపగిర్జీ బంగ్లాలోనే ఒకవారం పదిదినాలపాటుండవలెను- స్త్రీలకుగూడా ప్రత్యేకగదులు ఏర్పాటు చేసినారు- ప్రభుత్వమునుండి ౩౫౦౦రూ॥ వైద్యునికియ్యబడును. తక్కినఖర్చు గౌ॥ అబ్దులజీజుమంత్రిగారు సొంతముగా భరింతురు-రాయిబహద్దరుగారు ౨౭-నవంబరునాడు హైద్రాబాదుకువత్తురు. ఒకపక్షందినాలు గౌ॥ అబ్దులజీజుమంత్రిగారింట్లో బసచేయుదురు. మంత్రిగారు ౧౯౨౭నుండియే ఈధర్మచికిత్సలను పాట్నాలో చేయించుచూవచ్చినారు-మధురదాసు డాక్టరుగారు చేసినచికిత్సలలో నూటికొకటి జాగనవి. వీరికన్నమించిన కంటివైద్యుడు హిందూస్థానంలోలేడు. ప్రపంచంలో కూడ ఇంతకుమించిన కంటివైద్యుడులేడని అమెరికాలోని డా॥ ఫిషర్ అనువారు ఒప్పుకొన్నారు- ఏర్ దేశము డాక్టర్లు వీరిచేతిక్రింద పనిచేయుకొనుటకు ప్రార్థించిరి.

గ్రుడ్డివారికి గౌ॥ అబ్దులజీజు గారుచేసిన ఉపకారము అద్వితీయము. ఈ౨౫ఏండ్లనుండి వేలకొలది గ్రుడ్డివారికి ఈమంత్రిగారు దయతో ఉచిత చికిత్సచేయించి పుణ్యం కట్టుకొన్నారు.

## హిట్లరుతో సంధిమాటలేదు

### బ్రిటిషు ప్రభుత్వముయొక్క పట్టు

నవంబరు౧౦వ తేదిన లండనునగరంలో మేయరు విందుసందర్భమున బ్రిటిషుప్రధానిచర్చిల్ గారు ఉపన్యసించుచు యుద్ధవ్యవహారములనుగురించి ముచ్చటించిరి.

ఇపుడున్నస్థితిని సింహావలోకన చేసిరి, "దాదాపు యూరపుఖండమంతయు నాజీ ఆక్రోశ్యమునకు లొంగిపోయినది- పోలెండుపై దండయాత్ర హిట్లరు ప్రారంభించిన యుద్ధము ఇపుడు యూరపుఖండము వంతయు ఆవరించి ఆఫ్రికాఖండపు ఈశాన్యకోణములో ప్రవేశించినది-ఆదిఇక ఆసియా ఖండములో ఎక్కువభాగమునుగూడ, అంతేయేమి కనుక ఈభూగోళమున మిగిలియున్న సాల్గవభాగమునంతయుకూడ ఆవరించవచ్చును"అని చెప్పిరి. "రష్యనులు వేలకొలదిమందిలొంగినతర్వాత హింసించబడుచున్నారు"అనిరి. జర్మను లాక్రమించియున్న యూరపీయదేశములలో ప్రజలను నాజీలు అపరిమితముగ పీడించుచున్న సంగతిని వివరించి, అన్నిదేశములలోను కమ్యూనిస్టులు, యూదులు అను సాకుతో నాజీలచే హింసితులగుచున్నవారలను మనము తమదేశముకొరకై యుద్ధములోమరణించిన యోధులనుగానే భావించవలెను" అని చెప్పిరి.

తర్వాత బ్రిటనుయొక్క ఇప్పటియుద్ధశక్తిని వివరించిరి-పోయినసంవత్సరము "మనముఒక్కరమే స్వాతంత్ర్యరక్షణకై ఆయుధముల ధరించి నిలచితిమి-"ఇప్పుడు అమెరికా నౌకాదళములో ఎక్కువభాగము సమానశత్రువుపై నిరంతరము చర్యసాగించుచున్నది-ఇపుడు రష్యావారి ధైర్యప్రతిఘటనవల్ల జర్మనులసేనల బలముపై భయంకరములైనదెబ్బలు తగిలినవి... ఇప్పుడు మనకు జర్మనులవిమానముల బలమునకు సమానము అయిన విమానబలమున్నది- మధ్యధరాసముద్రములో మనమిప్పటికిని ప్రభువులముగా నున్నాము" అని చర్చిల్ గారుచెప్పి మరియు అమెరికానుండి సహాయము వచ్చుచున్నందువల్లను జర్మనులబిస్మార్క్‌అనుఓడను తాము ముంచివేసినందువల్లను, మంచి క్రొత్తయుద్ధనౌకలను, విమానవాహకము అను పెద్దనౌకలను నిర్మించుకొన్నందువల్లనుతాము భారతదేశ సముద్రములోకిని, పసిఫిక్ సముద్రములోకిని గొప్ప నౌకాదళమును రక్షణగా పంపించగలస్థితిలో నున్నామని చర్చిల్ గారనిరి.

## ౪ కోట్ల బ్రిటిషుఓడ నాశనం

ఇంగ్లీషువారికిచెందిన అర్క్‌రాయల్ అనుగొప్పనావను జర్మనీవారియూబోటు ౧౩ నవంబరునాడు ముంచివేసినది ఇదిచాలాగొప్పఓడ-దీనినిర్మించుటకు రెండున్నరసంవత్సరాలుపట్టినది- ఖర్చు ౩౦ లక్షలపౌనులు అనగా ౪ కోట్ల (కల్దారు) రూపాయలు, ౧౯౩౮ లో దీనినిపూర్తిచేసియుండిరి- దీనితూకము ౨౨౦౦౦టన్నులు. దీనిలో ౧౬౦౦మంది ఉండెడివారు- దీనిలో ౭౦ విమానాలుండియుండెను- ఇన్నివిమానాలను తీసుకొనిపోగలిగినఓడ ఎంతోపెద్దదిగాఉండినదని గ్రహించుకోగలరు. దీని ... ... దుగుల పొడువుఉండెను.

ఇది యూబోటులోని టార్పిడోవల్లమునిగి మునిగిపోయినది- దీనిలోని చాలామందిని మునుగకుండా రక్షించినారు- ఎందరుచనిపోయినారో యింకా తెలియరాలేదు.

పిమ్మట చర్చిల్ గారు జపానుకు ఇట్లుహెచ్చరికచేసిరి: "అమెరికాయే కనుక జపానుతో యుద్ధమునందు దిగవలసివచ్చినచో, బ్రిటిషువారు ఆతర్వాత ఒకగంటలోనే యుద్ధప్రకటన చేయగలరు......పసిఫిక్ సముద్రములో జపానువారలను ఎదిరించబోవు రాజ్యములలో దాదాపు ప్రపంచమందలి మూడువంతుల జన బలమున్నది...... జపానులో సంవత్సరమునకు ౭లక్షల టన్నుల ఉక్కుమాత్రమే ఉత్పత్తియగును. అటువంటిదేశము సంవత్సరమునకు దాదాపు ౯కోట్ల టన్నుల ఇనుము సుత్పత్తిచేయుచున్న అమెరికాసంయుక్తరాజ్యమును అనవసరముగా కయ్యమునకు కాలుదువ్వుట ఉపద్రవకరము-ఇందులో బ్రిటిషు సామ్రాజ్యముచేయగల సహాయమెక్కువను లేను చేర్చియుండలేదు...జపానుప్రాంతమున బ్రిటిషువారి అవసరములన్నిటిని రక్షించుటకు చేయవలసినసన్నాహములు చేయబడుచున్నవి."

చర్చిల్ గారు ముగించుచు నిట్లుచెప్పిరి"మనకు సహాయమున్నను మనవెంటరిగానున్నను, ఎంత గొప్పకష్టమును ఎంతదీర్ఘకాల మెదుర్కొనవలసివచ్చినను, బ్రిటిషు ప్రభుత్వమున్ను, బ్రిటిషువారియు అధినివేశరాజ్యములతో కలిసి హిట్లరుతోగాని నాజీపాలనక్రిందఉండు జర్మనీతోగాని సంధిరాయబారములలోకి ఎప్పటికిని దిగబోదు."




Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A. B. L.